యును. మనపూర్వులచే వ్రాయబడిన దేశచరిత్రలు గాని, మతగ్రంథములుగాని, పరహస్తగతంబగుట చేతనేమి, క్రిమిభక్ష్యంబుననేమి, అగ్నిదగ్ధంబుననేమి, యంతరించగా నున్నవాటినైన తాళపత్రాది గ్రంథంబులుగూడ సేకరించి, రక్షించి, భాండాగారమునవనింపి మాతృభాషాపోషకులై యభివృద్ధిగాంచువారు ధన్యులు. ఈగ్రంథాలయాభివృద్ధియే మన కార్యార్థము లోనగుసాధనము సౌఖ్యప్రదము. ఇంగ్లండు జర్మనీ మున్నగుదేశంబులందు, గ్రంథాలయములేని గ్రామముసహితము లేదగిరియే జెప్పవచ్చును. వెలకు వందలకొలది గ్రంథములు సంపాదించి గ్రంథాలయములనింపి కుతూహలులగుచున్నారు. ఆదేశమందు ధనికులెంతయు ధనసహాయము చేయుచుందురు. గ్రంథాలయోద్యమమునకు జనకతుల్యులని సువర్ణాక్షరములతో లెక్కనబడుచున్న ఒక "అండ్రూకార్నీజీ" యను ధనికుడెన్నియో గ్రంథాలయములనిల్పి ప్రోత్సాహపరచెను. అట్టి మహనీయుడీదేశమున కొరతపడుట మన దురదృష్టమని తలచవలెను. గ్రంథాలయములసంఖ్యగూడ మన దేశంబున స్వల్పముగ గోచరించుచున్నవి. ఒక్క బరోడారాజ్యములోమాత్రము శారదాదేవి రాజుయొక్క యాదరణ బొందగలిగినది. ఆరాజ్యములో ప్రతియొక్క పాఠశాలలో గ్రంథాలయమున్నట్లు తెలియుచున్నది. పాఠశాలకు సంబంధములేని యితర గ్రంథాలయముల నెన్నియో రాజాగారు పోషించుచున్నారు. అటనున్న కేంద్రగ్రంథాలయములనుండి జిల్లా తాలూకా గ్రామగ్రంథాలయములకెంతయు సహాయసంపత్తిగలదు. మ్యాజిక్ లాంతర్లవల్లనేమి, చిత్రలేఖనమువల్లనేమి, యీగ్రంథాలయములు ప్రజలనాకర్షించుచుండును. స్త్రీశాఖ, బాలశాఖయను విభజనలుగూడ ప్రతిగ్రంథాలయమందు బొడగట్టుచుండును. ఇట్టి సత్సంకల్పముతో గ్రంథాలయోద్యమమునకు దోడ్పడుచున్న బరోడా మహారాజును శ్రీ "శాయాజీగయక్వార్" మహాశయులెంతయు ధన్యులు. మరపురాని సచ్చరిత్రలో శ్రీవారినామము సువర్ణాక్షరములతో విలసిల్లుచుండును. బరోడారాజ్యమును తిలకించిరో శ్రీ తిరువాన్కూరు మహారాజాగారుగూడ తమరాజ్యమందు గ్రంథాలయోద్యమము విస్తరింపజేయుటకు ప్రయత్నించుచున్నారు. ప్రతిరాష్ట్రమునందును గ్రంథాలయోద్యమమునకు తమ జీవితసర్వస్వమునుగూడ ధారవోసిన మహామహులు కొందఱుండబట్టిరో శారదాదేవి సజీవముతో నుండగలిగినది. 1910-11 లో మన యాంధ్రరాష్ట్రమున, గ్రంథాలయోద్యమము ప్రారంభింపబడి, దినదినప్రవర్ధమానము బొందినదంటే దానికి చిరస్మరణీయులగు యిద్దరువ్యక్తులు గలరు. ఒకరు కీర్తిశేషులైన మారి వెంకటనృసింహశాస్త్రిగారు; రెండవవారు నాటినుండి నేటివరకుగూడ యెడతెరిపిలేని గ్రంథాలయ సేవజేయుచున్న శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారు. ఆంధ్రరాష్ట్రమున గ్రంథాలయోద్యమము చిరస్మరణీయము బొందవలెనన్న మనమెల్లర ముపేక్షాపరులమై యూరకొనక ప్రతిమానవుడు, స్వకుటుంబాభివృద్ధి, స్వశరీరారోగ్యము నెట్లుగోరుచు పాటుపడునో, గ్రంథాలయోద్యమమునకుగూడ నట్లు పాటుబడుట, తనపరమావధి యని దలచవలెను. దేశారాధన ప్రతివ్యక్తికి యమూల్యాభరణము. దేశోద్ధరణకు కృషిచేయవలెనన్న, దేశసేవచే జీవయాత్రనడుపుచు పాశ్చాత్యదేశములతోబాటు మనదేశమును పోటీకి నిలుపి, పురాతన మహోన్నత్య నిత్యసామ్రాజ్య సౌభాగ్యములు తిరిగి ప్రసాదించి, తద్దేశవాసుల యార్థికవృత్తులు సంపాదించి వారి సౌభాగ్యములు పాలు బంచుకొనవలెనన్న, మన దేశము తొల్లింటియౌన్నత్యము, సిరిసంపదలు సత్కళాభివృద్ధిబొంది, మన భావికాలాభివృద్ధికి, మూలకారణులగు విద్యార్థులగు యువకులకు నీతిమార్గములు ప్రసాదించవలెనన్న, మన బాలబాలి

కల విద్యావ్యాసంగములు అభివృద్ధి, దేశబాంధవుల భావోదయముల ప్రకాశింపజేయుట, దేశము యొక్క ప్రాభవప్రతిష్ఠలను, కీర్తిగౌరవములను గాపాడుట, మానవహక్కులకును, స్వాతంత్ర్యములకును శాశ్వతమైన పునాదులు వేయుట, జ్ఞానులయు, త్యాగులయు, వీరులయు సచ్చరిత్రలు మరపురానట్లు చేయుట, ఇయ్యవి చేయవలెనన్న గ్రంథాలయములే సాక్షీభూతములని గ్రహింపవలెను. వేలకొలది గ్రంథాలయములు స్థాపింపజేసి యందున్న జ్ఞానామృతమును ప్రజలు గ్రోలునట్లు చేయవలసిన బాధ్యత, గ్రంథాలయసేవకులయం దున్నదనుమాట మరువగూడదు.

భారతదేశీయ మహాజనసభాధ్యక్షులగు పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు అలహాబాదులో ఆనంద భవనము నొక పెద్ద గ్రంథాలయమును స్థాపింపకల్పించి యుండుటలో గ్రంథాలయోద్యమమందు శ్రీవారికెట్టి యాదరణాభిమానములు గలవో గ్రహింపుడు. ఆంధ్ర సోదరులీ సుప్రయత్నమును, జారవిడువక తగుసహాయ సంపత్తులతో గ్రంథాలయోద్యమమున కెంతయు తోడ్పడెదరుగాక యనియు, భగవానుడీ సత్సంకల్ప మచిర కాలములో నెరవేర్చుగాక యనియు ప్రార్థింపబడి రొడిని.

---

## మాల

మద్దూరి అన్నపూర్ణయ్యగారు

దేవళంబు మాల దివ్యంబుగాగట్టు
అందుగొల్వహక్కు నందలేదు;
బావిత్రవ్వ మాల పగలెల్లపనిచేసి
దానినీరువాడు త్రాగలేడు;
మేడగట్టిమిగుల మేలొనరించును
మాలదానియందు మసలలేడు;
రోడ్డువేయమాల రుధిరంబుజిమ్మును
అందునడువహక్కు పొందలేడు
చేనుదున్నుమాల చెమటనుగార్చుచు
గంజికైనలేక గింజుకొనును;
పాఠశాలమాల పరమభక్తినిగట్టు
అందుచదువలేడు డెందవలర;
వస్త్రయంత్రమెల్ల వానిచేసాగును
భార్యకైనబట్ట బడయలేడు;
కర్మనెల్లనీవు కౌతుకమొప్పార
పంచినామభువిని పాల్లుచేసి (?)
సుఖమదెల్లనీది దుఃఖముమాలది
బుద్ధియున్ననీదె బుద్ధియార!
ఫలమదెల్లనీది పనియెల్లవానిది
శక్తియున్నమాల భుక్తిగనడు
అన్నియున్న పెద్దఅన్నయ్య వేసుమ్మ
ఆర్యుననుచు దెల్పు నధముడీవు.
మాలవానికిలను మైలనుమాత్రమే
అనుభవింపగల్గు హక్కుగలదు
పేదవానికుర్వి వేదనయొక్కటే
యూవదాస్తియగునె నార్యపుత్ర!
ఆర్యధర్మమన్న నర్థంబునిదియెనా
చాలుచాలునీదు స్వార్థబుద్ధి!
వేదమతముయొక్క విధియిట్టిదైనచో
వందనంబుబాబు వద్దుమాకు.

# అపజయము

శ్రీమతి రాణీ చాకుంట సరస్వతీబాయిగారు

గత సంచిక తరువాయి

[లలిత భాస్కరరావు సోదరి. పద్మ వీరికి స్నేహితురాలు. లలితకు సహపాఠి. మాతాపితలు లేనిది. లలితా భాస్కరులతో కూడి ఆడుకొంటూ వుండేది. భాస్కరరావు బార్ అట్ లా చదవడానికి ఇంగ్లండు వెళ్లేడు. లలితా పద్మలు మెట్రికులేషను పరీక్ష ముగించారు. లలితకు వివాహనిర్ణయమైంది. చిన్నప్పటినుండీ మగవాళ్లంటే గిట్టని పద్మ కది రుచించిందిగాదు. మగవారి దౌర్జన్యాలు ఏకరువు పెడుతూ లలితను పెళ్లి మానేయమంది. కాని లలిత ఆశయాలు వేరు. పెళ్లి చేసుకొంది. పద్మకు కోపం వచ్చింది. ఆడువారి అబలత్వాన్ని నిందించింది. ఆ ఆశయాలతోనే బి. ఎ. ప్యాసయింది. స్త్రీలు పెళ్లాడి బాధ లెందు కనుభవించాలి అనే ధోరణిలోనే ఎపుడూ వుండేది. తరువాతి కథ చదవండి.]

౪

“లలితా! బి.ఏ. ప్యాసయాను. నీవలెనే తిన్నతిన్నగా మిత్రురాండ్రందరు నన్ను వదలిపోయినారు. అనగా వివాహాలు చేసుకొని అత్తవారిండ్లకు వెళ్లారు. నామాట లొక్కరికైన చెవుల కెక్కలేదుగదా అన్న విచారం. మన జాతిలో ఇంత దుర్బల ముండకం వల్లనే పురుషస్వాములు మన నిలా బాధిస్తున్నారు.

ఇక నాస్థితి. మాట్లాడ్డానికి కెవరూ లేరు. దినమంతా గ్రంథాలు, వార్తాపత్రికలు చదువుతుంటాను. చదువుతూ చదువుతూ విసిగినప్పుడు మాత్రం ఎవరైన మాట్లాడ్డానికి, సాయంత్రం షికారుకు వెళ్లడానికి ఉంటే బాగుంటుం దనిపిస్తుంది. మా వదినెకు యింటిపనులవల్ల తీరికే లేదు పాపం. ఏంచేయాలీ తోచదు. రాత్రిళ్లు గూడా ఏదో ఆవేదనగా ఉంటుంది. త్వరగా నిద్రపట్టదు. పట్టినాకలత నిద్ర.

మన మిత్రులలో ఒకళ్లైన ఉత్తరం వ్రాయరు. వాళ్లు ప్రస్తుతం తమ యానందంలో నన్ను మరచుంటారు. ముందుముం దెన్నటికైనా జ్ఞాపకానికి వస్తాను. వారి యీ ఆనందం అస్థిరమైందనే నాకింకా నమ్మకం. కాబట్టి నామాట లెన్నటికైనా నిజం గాకుండాపోవు.

“సోదరీ! నీవైన మరచిపోవనుకుంటాను నన్ను. వారంరోజుల కొకకైన ఉత్తరం వ్రాయుచుండుము. నే నెల్లప్పుడూ మీ శ్రేయమే కోరుచుండును. కాబట్టి శంకించక నీ కష్టసుఖములను తెల్పుచుండుము. ముందేమి రానున్నా యిప్పుడు మాత్రం సుఖస్తూనే ఉన్నారు. అదే పదివేలు.

ఇట్లు

పద్మ.”

ఈ ఉత్తరంవల్ల నాకు కొంత విచారం గలిగినప్పటికీ, పద్మహృదయ మొక కోరి

కతో బాధపడుచున్నది. ఆబాధ నివారించు మందు, దాని అన్న నిర్బంధము వల్లనైనా పుచ్చుకొనక తప్పదు.

పద్మ ఉత్తరానికి ప్రత్యుత్తర మిచ్చాను. దానిబాధ నుపశమింపజేయునది, జీవితానంద మొసంగునది, వివాహమేనని దాని నిర్వహణార్థము తగినవరుని తానే చూచుకొనుట మంచిదనిగూడా వ్రాశాను.

నే నీ ఉత్తరం వ్రాసిన కొలదికాలానికే మా పద్మను చూడడం తటస్థించింది. మా అన్నయ్య బ్యారిస్టరీ పరీక్షలో ఉత్తీర్ణుడై యింటికి వస్తున్నాడు. మా దంపతుల కాహ్వానం వచ్చింది. ఇద్దరం వెళ్లాం మా పుట్టింటికి.

పద్మ బొత్తుగా మారిపోయింది. ముఖం పాలిపోయింది. ఇపు డా ఉత్సాహం, ఆ చిరునవ్వు, ఆకాంతి పద్మముఖంలో కనబడడంలేదు. దాని ముఖం ఎండి నవ్యత నొందడానికి సుధావర్షము కోరుతున్నట్లుంది. ఎప్పు డేదో ఆలోచిస్తూనే ఉంటుంది. ఎవరితోగూడ ఎక్కువ మాట్లాడదు. దాని మనస్సులో ఏదో బాధపడుతూ న్నట్లనిపించింది నాకు. ఆ బాధకు కారణం దానికిగల రెండు వ్యతిరేకాభిప్రాయములే. వివాహం చేసుకోవడమా? చేసుకోకపోవడమా? మాటపట్టుదలగల పద్మ త్వరగా తన పరాజయాన్ని ఒప్పుకోవడంలేదు. తనకు గలిగిన కోరిక నణచివేయడానికే విశ్వప్రయత్నం చేస్తోంది.

పద్మను చూడడానికి వెళ్లాను. కుశల ప్రశ్నలైనయి. దాని యీస్థితికి కారణమడిగాను. చెప్పలేదు. రాత్రిళ్లు ఎక్కువగా చదవడంవల్ల యిలాంటి మార్పు గల్గిందన్నది. కాని నన్ను చూడ్డంతోటే అవమానం గల్గింది దానికి. దాన్ని కప్పిపుచ్చే ప్రయత్నం చేసింది. లేని నవ్వు తెచ్చిపెట్టుకుంది. దాని యవస్థచూచి నాకు జాలిగల్గింది. మా అన్నయ్య "రేపు వస్తున్నాడు, నీ బాల్యస్నేహితుడు స్టేషనుకు వస్తావా" అని అడిగాను. "నమ్మకంలేదు. రేపు చూద్దాంలే" అన్నది. నేను లేచి ఇంటికి వెళ్లాను.

౨

మా ఇల్లంతా మహానందంలో మునిగి తేలుతోంది. మా అన్నయ్య బొంబాయి నుండి టెలిగ్రా మిచ్చాడు. నిర్దేశింపబడిన వేళకు మా నాన్న, నేను, మావారు స్టేషను చేరుకున్నాం. అన్నయ్య నెదుర్కోవడానికి పద్మను రమ్మని మళ్లీ కబురు చేశాను. శరీరం స్వస్థతగాలేదని రానంది. ఇలాంటి సంతోషాల్లో అందరికన్న ముందు దూకే పద్మ ఇప్పుడు అందరికంటె వెనుకబడ్డది. తా నేదో గొప్ప అపరాధం చేస్తున్నట్లు భయపడుతుంది మాతో సంచరించడానికి.

రైలు రాగానే రెండవ తరగతి బండి వద్దకి వెళ్లాం. మా అన్నయ్యదిగాడు. మా మనుష్యులు ఆయన సామాన్లు తీస్తున్నారు. ఎంతోకాలానికి చూచాడు స్వజనాన్ని అన్నయ్య. మాకందరి కొకేసారి

ఆనందబాష్పాలురాలినై. అందరితో కల్సి ఇటూ అటూ చూస్తున్నాడు. "మన పద్మ రాలేదేం? పాపం భర్తతో కాపురం చేస్తుంటే రావడాని కెలాతీరుతుంది" అన్నాడు నిరాసతో. "ఆమె శరీరంలో అస్వస్థతగా ఉందిట. అందువల్ల రాలేదన్నయ్యా!" అన్నాను నేను. మేమంతా ఇల్లు చేరుకున్నాం సంతోషంగా.

మరుసటి రోజు పద్మవద్దకి వెళ్లాను అన్నయ్య రమ్మన్నాడని చెప్పడానికి. నేను వెళ్లేవరకు పద్మ తనలో తా నేదో ఆలోచించుకొని ముసిముసి నవ్వులు నవ్వుకుంటోంది. దాని యీసిథి నన్నూ సంతోషపెట్టింది. కాని దీనికి కారణం? నన్ను తాహంతోటే ఎదురుకొని కూర్చోమంది. అన్నయ్యను గురించి కుశలప్రశ్న లడిగింది. ఆయన్ను గురించి క్లుప్తంగా కొన్ని విషయాలు చెప్పి, తన్ను చూడ్డానికి రమ్మన్నాడని చెప్పాను.

పద్మ:—సరే! ఇన్ని సంగతులు చెప్పావు గాని మీ అన్నయ్య ఒక లేడీని మెడకు గట్టుకొచ్చాడా? మన బ్యారిస్టర్ గార్ల కది మొదటి క్వాలిఫికేషన్.

నేను:—చెప్ప మరిచాను. తెచ్చుకున్నాడు. అహాహా! ఆమె అందం చెప్పడానికి నా తరంకాదు. ఆమెను చూపడానికే ఇప్పుడు రమ్మనడం.

ఈమాట విన్నంతోనే ఒకనిట్టూర్పువిడిచింది పద్మ. "మన భారతీయయువకులు తమశీలాన్ని పాడుచేసుకుంటున్నారు గదా" అంది విచారంతో. పద్మ నాకు వదినైతే బాగుండే దనిపించింది. వారి దాంపత్యం అనన్యసామాన్యంగా ఉంటుంది. దైవేచ్ఛ ఎలాఉందో.

"పద్మా? లేవేం! వెళదాం! పాపం అన్నయ్య నిరీక్షిస్తుంటాడు" అన్నాను.

పద్మ:—నన్నాట్టే నిర్బంధపెట్టబోకు. తొందరేంవచ్చింది. చూద్దాంలే. అయినా యౌవనమందున్న పురుషులను చూడాలన్నా, మాట్లాడాలన్నా భయమేస్తుంది. కాబట్టి ఇప్పటికి "క్షమించ ప్రార్థించితి"నని చెప్పుమీఅన్నతో. ఇన్నాళ్లైనా పద్మ జ్ఞాపకం ఉన్నందులకు నాకృతజ్ఞతావందనము నీవే వారి కందచేయి.

"యీదొంగవేషాలన్నీ కట్టిపెట్టు, నీవు రాకతప్పదు" అని పద్మను చేయిబట్టిలాగాను. లేచి "సరేపద" అని బయల్దేరింది.

దారిలో "సరేగాని లలితా! నిజంగా భాస్కరరావుగా రొక ఆంగ్లస్త్రీని వివాహం చేసుకున్నాడా? మీనాన్న ఆమెనింటి కెలా రానిచ్చాడు. మీఅమ్మ గోలపెట్టడం లేదూ?" అంది.

నాకు నవ్వొచ్చింది "తొందరపడతావేం? అన్నీ తెలుస్తాయిగా!" అన్నాను నవ్వుతూనే.

మాయిల్లు ప్రవేశించాం. మాఅన్నయ్య మా యల్.యల్.బి. గారూ ఏదో మాట్లాడుతూకూర్చున్నారు. అక్కడికే వెళ్లాం. "అన్నయ్యా! పాపం పద్మ మీఇంగ్లీషులేడీ

గార్ని చూడాలనొచ్చింది. చూపింపరేం" అన్నాను నవ్వుతో. వారిద్దరూ నవ్వారు. పద్మకు కోపంవచ్చింది. పరాజయం లభించింది పాపం!

భా:—పద్మం! కూర్చో. నీవింతదనుక వివాహం చేసుకోకుండా ఉండి బి.ఏ. చదివావంటే చాలసంతోషించాను. ముఖమంతా పాలిపోయింది. జబ్బేమన్నా చేసిందా? లేక ఎక్కువగా చదవడంవల్ల ఇలా మారిపోయినావా?

పద్మ:—జబ్బేంలేదు. చదవడంవల్లనే ఇలా అయిందనుకుంటాను.

నేను:—అదీకాదన్నయ్యా! మీ పురుషుల నందరినీ ఒక మహాసముద్రంలో ముంచి, తాను మహారాజ్ఞిగా, తనప్రజలంతా స్త్రీలుగా, యీ ప్రపంచా న్నేలుకోవడానికి మార్గాలాలోచిస్తోంది. ఆ ఆలోచనల్లోనే నిద్రాహారాలుగూడ మానేసిందేమో?

భా:—ఇప్పుడుగూడ నీవు మాఅందరికీ మహారాణివే. మేము నీఆజ్ఞలకు బద్ధులమే. దాని కింతప్రయాసం ఎందుకు పద్మా!

పద్మ:—లలితా! వేళాకోళంచేయడానికా నన్నిక్కడికి రమ్మన్నావు?

నేను:—నిజంచెప్తే నీకింతకోపం ఎందుకు?

భా:—పద్మా! పోనీ ఆసంగతి డ్రాప్ చేద్దాం! గాని చిన్నప్పటికళాకాంతులు లేవేం నీముఖంలో? అదిగాక నాముందు సిగ్గుగూడ పడుతున్నావు. కారణం?

పద్మ:—సిగ్గెందుకు? అయినా బాల్యావస్థే ఎల్లకాలం ఉంటుందా?

భా:—ఏండ్లు వచ్చినయి. అంతేగాని నాకు నిన్ను చూస్తే మళ్లీ ఒకపరియాయం నీతో ఆడుకోవా లనిపిస్తుంది.

నేను:—అబ్బో! చాలా పెద్దకోరికే కోరావు అన్నయ్యా!

భా:—ఇందులో తప్పేముంది. చదువుకున్న వాళ్లల్లోగూడ పూర్వపుభావా లుండవనుకుంటాను.

నేను:—అలాకాదు. పద్మాదేవిగార్కి అసలు పురుషులంటేనే గిట్టదంటే నీతో ఎలా ఆడుకుంటుంది. నీవు పురుషుడవు కావా?

పద్మ:—తిర్గి నీఉపన్యాసం మొదలెట్టావు లలితా! నిన్ను మాట్లాడించిం దెవరు?

"మీరే మాట్లాడుకోండి నేను వెడతాను" అని లేచి లోపలికి వెళ్లాను. మా యల్.యల్.బి.గా రిదివరకే స్నానానికి వెళ్లారు.

వారిద్దరూ సుమారొకగంటసేపు మాట్లాడుకొన్నారు. ఇంగ్లాండువిషయాలు కొన్ని మాఅన్నయ్య చెప్తూంటే లోపల ఉండి విన్నాను.

## ౬

నేనూ అన్నయ్యా, పద్మ షికారుకు వెడుతుండేవాళ్లం సాయంత్రం. పద్మముఖంలో జీవం కనబడుతుంది. ఇది భాస్కరసందర్శన

మహాత్మ్యమేమో ననుకున్నాను. అది ప్రకృతి సిద్ధమేగా!

పద్మ ఇంట్లోనే ఆగిపోయినాను నిర్బంధం వల్ల సాయంత్రం వి.కారునుండివస్తూ. లోపలికి వెళ్ళగానే పరధ్యానంగా అన్నట్లుగా అన్నాను. "పాపం! పద్మం శీతకరకిరణ ప్రసాదమున కృషించి ముకుళించి యిప్పుడిపుడే భాస్కరోదయమున ముసిముసి నవ్వులు నవ్వుతోంది."

"ఏం లలితా! నీకేం మతిపోయిందా? రాత్రిపూట భాస్కరోదయమేమిటి? పద్మం వికసించడమేమిటి" అని నవ్వింది పద్మ.

నేనూ:—నవ్వుతూ "ప్రియసందర్శనం పద్మాని కెంతసంతోషం కలిగించింది. ప్రకృతిలో భగవంతుడొక ప్రత్యేకవ్యక్తికి, మరొక ప్రత్యేకవ్యక్తితో ప్రేమబంధమేర్పచి యుంచాడుగదా" అన్నాను.

"ఎప్పుడూ నీకు ప్రేమ, ప్రియులముచ్చటలే. బ్రహ్మచారిణి ముందలాంటిమాటలు ముందెన్నడూ మాట్లాడుబోకు" అన్నది చిరునవ్వుతో.

నేను:—అలాగేం! తమరుకూడ గృహిణులైతే ఇంతకన్న ఎక్కువేకావాలి. తొందరెందుకు. కొద్దిలోనేఉంది.

పద్మ:—అయితే! నేను వివాహం చేసుకుంటాననే నీయభిప్రాయం? ఎన్నటికీ చేసుకోను.

ఆమాటల్లో పూర్వపు పట్టుదల కనబడ లేదు.

పద్మ:—అదంతా ఏమోగాని, పురుషులతో ఆపవిత్రదాంపత్యసంబంధంకంటే స్నేహభావంతో నిర్మలంగా సంచరిస్తే బాగనిపిస్తుంది.

నేను:—అవు నలాగే తోస్తుందిపుడు. ముందు —

పద్మ:—ముందు? ముందేమైతుంది?

నేను:—ఏమైతుందో నేను చెప్పను, గాని నిన్న మీ అన్నయ్య మాఇంటికివచ్చి మానాన్నతో ఏమో మాట్లాడుతున్నారు.

పద్మ:—(ఆత్రంతో) ఏమిమాట్లాడారు? నీకేమైనా తెలుస్తే చెప్పు!

"నాకేంతెల్సు. మీఅన్నయ్యనే అడగగూడదూ!" అని లేచాను వెళ్ళడానికి. పద్మ యింకా కూర్చొమన్నది కాని రాత్రైనందున వేళైందని బయల్దేరేను.

"వదినా! తిర్గిరేపు దర్శనం చేసుకుంటారు" అని అంటూ పరుగెత్తాను. పద్మ లోనికి వెళ్ళిపోయిందనుకుంటాను.

మాయింట్లో అందరం భోజనాలు చేస్తున్నాం. పద్మసోదరుడు మాట్లాడినవిషయం చెప్పారునాన్న. భాస్కర్రావుకు పద్మతో వివాహంచేయాలని ఉందన్నాడు. మానాన్న వరదక్షిణపక్షమువాడు కాడు. లేకుంటే అన్నయ్య ఇంగ్లాండుకువెళ్లిన ఖర్చులైన నంపాదించేవాడే. భాస్కరునడిగి చెప్తానన్నాట్ట. అన్నయ్య తలవంచుకొని లోలోననవ్వుకుంటున్నాడు.

"ఏం! భాస్కర్! పద్మతో వివాహం నీకిష్టమేనా?" అన్నాడు నాన్న.

భాస్క:— నాన్నా! ఆ పిల్ల అసలే వివాహం చేసుకోకుండా జీవితం సాంతం బ్రహ్మచర్యంగా గడుప దలచిందటగా?

మాఅమ్మ నవ్వుతూ "ఏమోనండి మహా గడుసుపిల్ల. చదువుకున్నాళ్ల కిదోరోగం" అంది.

మేమంతా నవ్వాం. "కోడలిమీద హుకుమ్ చలాయించడానికి వీల్లేదనా? అత్తే విస్తున్నావు" అన్నాడు నాన్న.

నేను:— అసలు పద్మ మీకు కోడలు కావడ మెలా? వివాహం చేసుకోదుట నాన్నా!

నాన్న:— అదంతా వాండ్ల అన్నయ్య ఏర్పాటు చేసుకోండే నాతో ఎలా మాట్లాడుతాడు.

నేను:— పద్మకిష్టమైతే అన్నయ్యనొప్పించే పూచీ నాది.

భోజనాలు పూర్తిఅయినవి లేచాం.

అంతా నిశ్చయమైంది. ముహూర్తంగూడ పెట్టుకున్నారు. పద్మ, వాళ్ల అన్న వదిన ఒకటేతీరుగా నిర్బంధపెట్టడంవల్ల ఎలాగో ఒప్పుకుందిట! అయినా లోకులంతా దంపతులుగా భావించినా తానుమాత్రం అలా ఉండదట. ముడిపడ్డాక ఏలాఉన్నసరే నను కున్నాను.

బంధువులంతా వచ్చారు. ఎంతోమంది మిత్రులువచ్చిరి. వివాహం మహావైభవంగా జర్గింది. తగుమూకలులేవు. బ్రాహ్మణ సంతర్పణలులేవు ఒక్కదినముతప్ప. తక్కిన నాల్గుదినములు బీదలకు పెట్టించాం. చూచిన వారు, విన్నవారుగూడ ఆనందించారు వీరి దాంపత్యానికి. వధువు 18 సంవత్సరముల కన్య బి. ఏ. ప్యాసైంది. వరుడు బ్యారిస్టర్ 25 సంవత్సరముల బ్రహ్మచారి. ఇద్దరు బాల్యమిత్రులు. ఒకరినొకరు వరించుకున్నారు. ఈ మధ్యకాలంలో బాల్యవివాహములు ప్రబలి మనసంఘాన్ని పాడుచేసినయి గాని పూర్వం ఆర్యుల్లో యిలాంటి వివాహాలే జరుగుతుండేవట.

వివాహం పూర్తిఅయింది. ఆరవనాడు సాయంత్రం మాఅన్నయ్యా, పద్మా, తోటలో తిర్గుతున్నారు. చిన్నగా నేను వారిని వెంబడించాను కానరాకుండా, నాచేతులో క్యామరాఉంది. వా రొకచోట కూర్చున్నారు. పద్మభుజంమీద అన్నయ్య చేయివుంది. పద్మ తనతల అన్నయ్య భుజంమీదపెట్టి అధోవదనముఖం చూస్తోంది. ఇదే సమయమని స్నాప్ కొట్టాను. నా కోరిక నెరవేరింది.

మర్నాటివరకు ఫోటో తయారైంది నా కోరికప్రకారం. దానిక్రింద "అపజయము" అని వ్రాశాను.

ఈపటం తీసుకొని అన్నయ్య గది ముందుకు వెళ్లాను. లోపల నూతన దంపతులున్నారు. 'నేను లోనికి రావచ్చునా?'



బొంబాయి, విక్టోరియా గార్డెనునందు హంసలుండు కొలను దృశ్యము.



తన్మయత

అన్నాను. "సంతోషంగా" అన్నా డన్నయ్య. లోనికి వెళ్లాను. "అన్నయ్యా! నీ ఫోటో చూపిస్తాను. మహా చిత్రమైంది, గాని వదినతో మాత్రం దానిసంగతి చెప్పకు" అన్నాను పద్మవైపు చూస్తూ. పద్మ ముఖం వాల్చుకుంది తనకుగూడా చూపలేదన్న కోపంతో. అన్నయ్య ఫోటో చూచి ఒక్క పెట్టున నవ్వాడు, పద్మవైపు చూస్తూ.

పద్మ:—ఏమిటా సంతోషం, పట్టలేకుండా ఉన్నారు?

"వదినా! నీ కెందుకు కోపం! పోనీ, నీవుకూడ చూడు" అంటూ చూపించాను చిత్రాన్ని. కోపంవచ్చింది, తన పరాజయాన్ని చిత్రించానని. 'అబ్బా! ఏం [illegible] వేషాలు!' అన్నది.

నేను:—వదినా! యీదంపతులు ప్రపంచంలోకల్లా అద్వితీయులు, కాబట్టి యిలాంటి చిత్రాన్ని ఏదైన పత్రికకు పంపిస్తాను మీ పేర్లుగూడ వ్రాసి. అనుజ్ఞ యిస్తావా?

"ఏమో? ఏమన్నా చేసుకో! నా కెందుకు? నాఅనుజ్ఞ తీసుకొనే ఈపని చేశావా? ఇప్పుడుమాత్రం నాఅనుజ్ఞ ఏల?" అంటూ కోపంతో బైటకు వెళ్లింది ఆ పటం గుంజుకొని.

## గమనింపు

రాబోవు అక్టోబరు మాసారంభమున యథాప్రకారము గృహలక్ష్మి దసరా సంచిక వెలువడును. దానిలో స్త్రీలచే మాత్రము రచియింపబడు వివిధవిషయములకు సంబంధించిన చక్కని పద్య గద్య వ్యాసములు ప్రకటింపబడును. దీనికాంధ్ర విద్వత్సోదరీమణుల సాహాయ్య మత్యంతావశ్యకము. కావున సోదరీమణులెల్ల తమ పద్య గద్య వ్యాసములను సాధ్యమైనంత త్వరగా బంపి దసరా గృహలక్ష్మి సర్వాంగ సుందరిగా వెలువడునట్లు తోడ్పడుదురని మనవి. రచయితలు తమ ఛాయాచిత్రములనుగూడ పంప ప్రార్థన.

సంపాదకుడు.

# ఈ హత్యానేర మెవరిది?



గర్భాశయరోగాలను పారద్రోలుటకు

## మార్గము వెతుకని ఆమెదే

అని సత్యము ప్రతిధ్వనిస్తున్నది.

ఆమె అశ్రద్ధవల్ల సహజసంతానము—
యేదో లోలోపనే గొంతు నొక్కి—
చంపినట్లుగా లేకపోతున్నది.

గర్భాశయరోగాలను పారద్రోలి ఆరో
గ్యము సంపాదించుకొన్న స్త్రీకి సహజ
మైన సంతానసౌఖ్యము లభిస్తున్నది.

గర్భాశయరోగ నివారణమునకు
"లోధ్ర" పెట్టినది పేరు.

సంతానసంజీవి — ఆరోగ్యప్రదాయిని
"లోధ్ర."

కేసరికుటీరం — మదరాసు

ఏజంట్లు : శీతారాం జనరల్‌స్టోర్సు — బెజవాడ

# కుసుమ

"శ్రీ ప్రేమచంద్ జీ"

ఆధునిక హిందీకథాలేఖకుల్లో ప్రేమచంద్ జీ సర్వశ్రేష్ఠుడు. ఆయన వ్రాసే కథలు భావపూరితోనూ, మనోవిజ్ఞానంతోనూ కూడివుంటై. ఆయన 'సేవా సదనం, ప్రేమాశ్రమం, రంగభూమి' మొదలైన నవలలుకూడ చాలా వ్రాశాడు. ఆ నవలలు రవిబాబు, శరత్ బాబు వ్రాసే నవలలకు తీసిపోవు. ఆయన వ్రాసిన కథలు చదువుతూవుంటే రష్యాదేశపు టాల్‌స్టాయి జ్ఞాపకం వస్తూవుంటాడు. అందువల్లే ప్రేమచంద్ జీ 'నవలాచక్రవర్తి' అను బిరుదాన్ని గ్రహించగలిగాడు. 'హంస' మాసపత్రికకు సంపాదకుడు.

ఆయన వ్రాసిన కథలు భారతీయభాషలలోనేకాక విదేశీయభాషలలోగూడ అనువాదం అవుతూవున్నై. మన భాషలోకూడ ఆ ప్రతిభాశాలి వ్రాసిన కథలు, నవలలు అనువాదంచేస్తే చాలా బాగుంటుంది. కొన్ని గ్రంథాలు మన భాషలో కూడ అనువాదం అయినట్లు తెలుస్తూంది. అవి అంత ప్రసిద్ధిలోనికి వచ్చినట్లు తోచడంలేదు. ప్రస్తుతం ఆంధ్రదేశంలో హిందీ చదువుకున్నవారి సంఖ్య జాస్తిగానేవుంది. కాని రత్నపరీక్షకులం కాలేకపోయాం మనం. మాతృభాషాభండారాన్ని రత్నాలతో నింపడానికే వివిధభాషలను నేర్చుకో ప్రయత్నించాలి మన ఆంధ్ర సోదరసోదరీమణులు [అనువాదకుడు.]

సంవత్సరం నాటిమాట. రోజూలా షికారు వెళ్లుతుండగా నవీనుడు కనుపించాడు. అతను చిన్ననాటి నుండి నా స్నేహితుడు. అతని వాసస్థలం ఆగ్రాపట్టణం. మంచి కవికూడాను. నేను అతని కవిసమాజానికి చాలా పర్యాయాలు వెళ్లాను. ఇటువంటి కవితో పోసనుల్ని నేనెప్పుడూ చూడలేదు. వృత్తివకాలతు కాని యెప్పుడూ కావ్యచింతనలోనే మునిగివుంటాడు. అతనికి వాదనాశక్తి బాగావుండటంవల్ల తరచుగా కేసులు వస్తూనే వుంటై. కోర్టువిలువల కోర్టువిషయంగాని, కేసులవిషయంగాని అతనికి నిషేధం. కోర్టులోవుండే ఆ అయిదారుగంటలే వకీలు. మిగతాసమయమంతా ఆపాదమస్తకం కవి. ఎప్పుడుచూచినా కవిబృందం అతన్ని అంటిగట్టుకొనేవుంటుంది. అతని పదాలు బాణంవలె సరుగా తిన్నగా హృదయంలో నాటుకుపోతై. అతని స్వరమాధుర్యం దానికి ముఖ్యకారణం. అతను లక్నో వచ్చేముందు నాకు తెలియజేస్తూవుండేవాడు. ఈదినం అతన్ని లక్నోలో చూడగానే ఆశ్చర్యంగలిగి "నీవెప్పుడు వచ్చావు? కుశలమా? నీవువచ్చేముందు నాకు తెలియజేయలేదేమి?" అని అడిగాను నవీనుణ్ణి.

"కొన్నివిపత్తుల్లో చిక్కుకొనివున్నా. నీకు తెలియజేయడానికి సమయంలేకపోయింది. నీ సహాయాన్ని వాగ్దానంగానే కలుస్తా. నేనే ప్రయత్నాలు చేయడ మనవసరం. ఇప్పుడు నిన్ను కష్టపెట్టడానికి వచ్చా. షికారువెళ్ళడం మానేయి. ఇంటికివెళ్లిన తర్వాత నా విపత్కథంతా చెపుతా" అని నవీనుడు జవాబిచ్చాడు.

నేను భయంతో "నన్ను చింతానిమగ్నుణ్ణి చేశావు. నీకేమిటి విపత్కథేమిటి! నాకేమితోచడంలేదు" అని అన్నా.

"ఇంటికి పద. మనస్సు కుదుటపడిన తర్వాత చెప్తా."

"పిల్లలంతా కుశలమా?"

"ఆ. అటువంటిదేమీ కాదు."

"రెస్టారెంటులో ఫలహారం తీసుకుందువు గానిరా."

"ఇప్పుడు కాదు."

మేమిద్దరం యింటికి బయలుదేరి వెళ్లాం. ఇంటికి వచ్చిన తర్వాత పాదాలకు నీళ్లు, త్రాగడానికి షర్బతు యిచ్చా. కొంతసేపయిన తర్వాత తన విపత్కథంతా చెప్ప ప్రారంభించాడు వసీనుడు.

"కుసుమ వివాహానికి నీవూ వచ్చావు. అంతకు ముందే కుసుమను అనేకపర్యాయాలు చూశావు. పరవశ్యభావులైన యువకుల్ని ఆకర్షించే గుణాలు ఆమెలో వున్నవనుకుంటా. దాన్ని నీవు వొప్పుకుంటావా?"

"నీకంటే కుసుమను యెక్కువ ప్రశంసించుతా. అట్లాంటి స్వభావం గల పిల్లని యెక్కడా చూడలేదు నేను" అని జవాబిచ్చా.

వసీనుడు కరుణాస్వరంతో దీనంగా అన్నాడు. "ఆకుసుమ నేత్రాలనుండి యీదినం కన్నీళ్లు కాల్వలై ప్రవహిస్తున్నై. తనభర్త చూపించే నిర్దయే దీనికి కారణం. పునస్సంధానమై వొకసంవత్సరం కావస్తూవుంది. ఈమధ్యలో మూడు పర్యాయాలు అత్తగారింటికి పోయింది కుసుమ. కాని వొకపర్యాయమైనా ఆమె భర్త ఆమెను పలకరించలేదు. ఆమెముఖం చూస్తేనే అసహ్యించుకుంటాడు. అతన్ని పిలవనంపి నాదగ్గరికి పద్ధతిగూర్చి ప్రశ్నించా. రాకపోగా వుత్తరాలకైనా జవాబు యివ్వలేదు అతను. అతను తనభార్యను ప్రేమించకపోవడానికి కారణమేమిటో నాకు తెలియదు. రెండో వివాహం చేసుకోబోతున్నాడని తెలుస్తూవుంది. నీవు గుర్తుపట్టలేనంతమార్పు చెందింది కుసుమ. రాత్రింబవళ్లు యేడ్వడంతప్ప రెండోపనిలేదు. నాదుఃఖం నీకే తెలియాలి. భాగ్యాలన్నీ మట్టిపాలైనా, కొడుకులు లేకపోయినా, కుసుమను చూసుకునే ధన్యతచెందానుకునే వాణ్ణి. లోటులేకుండా విద్య చెప్పించా. బి. ఎ. చదువుకోకపోయినా బాగా చదువుకున్న స్త్రీకి విచారాల్లో గాని జ్ఞానంలో గాని తీసిపోదు. నీవు కుసుమ వ్రాసిన వ్యాసాలు చాలా చూశావు. ఆమాదిరి వ్యాసాలు యే కొద్దిమంది స్త్రీలో వ్రాయగలుగుతారని తెలుస్తూ. వాగ్వాదంలో ఆమెను యెవరూ జయించలేరు. గృహకృత్యాల్లో బహు నేర్పరి. కాని తనభర్త దృష్టిలో పాదధూళికైనా సరిపోదు. నీకేమైనా అతన్ని అనరానిమాట అని వుండాలి. లేకపోతే నీతో వుదాసీనంగా యెందుకు వుంటాడని అనేకపర్యాయాలు కుసుమను ప్రశ్నించా. 'నాతో మాట్లాడేదెన్నడుగనక యెప్పుడు' అని జవాబిచ్చేది కుసుమ. ప్రథమదినమే వారిద్దరికీ పరస్పర విరోధం కలిగిందని తెలుస్తూ. కుసుమను ఆమెభర్త యేమైనా అడిగి వుంటాడు. సిగ్గుచే జవాబియ్యకపోతే యింకొన్ని మాటలు అడిగివుండవచ్చు. ఏమైనా రెట్టించక పోవచ్చు కుసుమ. కుసుమకు సిగ్గు పుట్టుకతోనే వచ్చిన సంగతి నీకూ తెలుసు. ఆమెభర్త వుదాసీనంగా వుండడానికి కారణం అదేననుకుంటా. కుసుమవంటి బాలికతో యెప్పుడుగాని వుదాసీనంగా వుంటాడని నేను కలలోనైనా అనుకోలేదు. ఇదంతా నాదురదృష్టం. కుసుమ భర్తకు చాలా వుత్తరాలు వ్రాసింది. కాని ఆనిర్దయుడు వొక్క వుత్తరానికైనా జవాబు యిచ్చిన పాపాన పోలేదు. వుత్తరాలన్నీ చింపేశాడు. ఆపాపాత్ముని హృదయాన్ని కరిగించే వుపాయం నాకేమీ తోచడంలేదు. నేనా వానికి వుత్తరం వ్రాయదలచుకొని వున్నా. నీవే కుసుమని రక్షించాలి. లేకుంటే ఆప్రాణం కాస్త యెప్పుడో యెగిరిపోతుంది. చెప్పుతుంటా వా

తెలివాడు స్త్రీ మృదుతరహృదయాన్ని దుర్మార్గంతో న
లిప్పాలడు? కావలసిన పరిణామం అయితీరుతుంది.
అబలకృశించిదిక్కులేక మరణిస్తుంది. భర్త స్నేహాన్ని
పొందని తన జన్మ వ్యర్థమని ఎంచిందని తెలుస్తుంది స్త్రీ.
ఆ ప్రేమను ఆధారం చేసుకుని తానుపొందే కష్టాలన్ని
టినీ సంతోషంతో అనుభవిస్తూవుంటుంది. పురుషుని
హృదయంలో ప్రేమవసంతమునకు ప్రవేశించినపుడు
స్త్రీ లోకోత్తమోత్త ఆశాపల్లవాలు బయలుదేరేవస
యం కోసమయింది. కొందరు పురుషులో ఆవృక్షాన్ని గొడ్డలితో
నరికే నిర్దయులెవరుంటారు? నేను రెండో వుత్తరం
చదువ ప్రారంభించా.

సు

## రెండో వుత్తరం

నాజీవనధనమా,

నేను రెండువారాలవరకు మీజవాబుకు ప్రతీ
క్షించి యీదినం మరల మిమ్ము కష్టపెట్టదలంచా.
నేనావుత్తరం వ్రాసినసమయాన మీరు నాకు తప్పక
జవాబు యిస్తారని నాహృదయం సాక్ష్యమిచ్చింది.
ఆశకువిరుద్ధంగా ఆశపెట్టుకునివున్నా. అవకాశం
లేకగాని అస్వస్థులుగావుండిగాని నావుత్తరానికి
జవాబు వ్రాసియుండరని తలుస్తున్నా. భగవంతుని
దయవల్ల మీరు అస్వస్థులు కాకుందురుగాక. ఎవర్ని
అడగడం? ఈవిచారంతోనే నా హృదయం కంపించి
పోతూవుంది. మీరు ప్రసన్నులుగా ఆరోగ్యవంతు
లుగా వుండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నా. మీరు
నావుత్తరానికి జవాబు వ్రాయకపోయినా సరే.
రోజు పూజిస్తుంటా. మీరే నా దైవస్వరూపులు.
మీకు కష్టంగలిగినపుడు నాకు వుత్తరం వ్రాయండి.
ఎవరికైనా తెలియనుని మీవద్దకు వస్తా. మర్యాదస్తు
లకు లోబడివుండటం నాకు కష్టంగావుంది. ఆస్థితిలో
గూడ నాసేవను మీరు కోరకపోతే నాజీవితంలోని
అమూల్యవస్తువును మీరు లాక్కుంటున్నారనితలుస్తా.
తినటానికి యింత గంజో, అంబలో, కట్టుకోవటానికి
యే పెండ్లిగుడ్డో యివ్వమని అడుగుతున్నా. ఇంకా
కేమీయివ్వమని కష్టపెట్టను. ఘోరవిపత్తులలోగూడ
మీతోవుండి సంతోషంగా కాలంగడుపుతా. నాకు
ఆభూషణాలకోరికగాని, మేడల్లోనివసించే కోరిక
గాని, ధనోపార్జన కోరికగాని, పట్టణాలకుపోయే
కోరికగాని లేదు. నాజీవనోద్దేశ్యం మీసేవ చేయ
డమే. ఇదేనా ధ్యేయం.

నాకీప్రపంచంలో దేవతలు, గురువులు, రాజులు
ఎవరూ లేరు. నా దేవతలు, నా గురువులు, నా
రాజులు మీరే. మీరు మీపాదాలనుండి నన్ను త్రోసి
వేయవద్దు. నేను నీచా పుష్పాల్ని, కర్తవ్యనైవేద్యాన్ని
నామనసులో భద్రపరచుకుని మీ సేవచేయడానికి
వచ్చా. నా యీనైవేద్యాన్ని, పుష్పాల్ని మీపాదాల
మీద వుంచనివ్వండి. పూజచేయడం వుపాసకునిపని.
దేవత ఆపూజను స్వీకరించినా, స్వీకరించకపోయినా
ఆలసించడం అతని ధర్మం కాదు.

నాకేలోముసటమా, నాయిప్పటిదశ మీకు తెలి
యదు. తెలిస్తే యింతనిర్దయగా ప్రవర్తించరు. మీరు
పురుషులు. మీహృదయంలో దయ, సానుభూతి,
వుదారతలున్నై. మీరు నావంటిఅభాగ్యవస్తువును
క్రోధంగా చూస్తారని నేననమ్మను. నేను దయా
పాత్రురాలను. మీరు సూర్యులు; నేను అణువును,
మీరు అగ్ని; నేను తృణాన్ని, మీరు రాజులు;
నేను భిక్షకురాల్ని. క్రోధం సమానులమీద చూపిం
చాలి. నేను మీక్రోధాఘాతాన్ని యేవిధంగా సహిం
చటం? మీసేవకు నేను అర్హురాలనుగాదని తలంచితే
మీరు నాకు విషపుగిన్నెను యివ్వండి. అమృతంగా
భావించి నేత్రాలకద్దుకుని త్రాగివేస్తా. నామరణంవల్ల
మీరు నిశ్చింతులైనారనే సంతోషం చాలునాకు. నేను
మీదాన్ని. ఎల్లప్పుడూ మీదాన్నిగా వుంటా. ఈ
జీవితంలోనేగాదు. అనంతంవరకు. ఇదే నాకోరిక.

అభాగిని,
కుసుమ.

మీ వుత్తరం చదవగానే నాకు కుసుమమీద కోపం వచ్చింది. ఆగాడిదమీద అసహ్యమేసింది. నీవు స్త్రీవి కనుక ప్రస్తుత ఆచార ప్రకారం పురుషునికి నీమీద అన్నివిధాల అధికారంవుంది. కాని వ్యక్తిగత కూడ హద్దువుండాలి. స్త్రీకి అభిమానం, కనీసత కొంచెం వుండాలి. పురుషుడు స్త్రీని ఒత్తిడిచేస్తే స్త్రీకూడా అతన్ని లెక్కచేయకూడదు. మనం స్త్రీలకు ధర్మశాస్త్రాలపాఠం చెప్పి వారి ఆత్మసమ్మానాన్ని, ఆత్మవిశ్వాసాన్ని అంతమొందించాం. పురుషుడు స్త్రీని ఆశ్రయించుకొని వుండనపుడు స్త్రీ మాత్రం ఎందుకు ఆశ్రయించుకొనివుండాలి? భగవంతుడు పురుషునికియిచ్చిన శక్తులు స్త్రీకి యివ్వలేదా? పురుషులు తెలివిగలవారైతే స్త్రీలు అవివేకులా? పురుషులకు కండ్లు నెత్తిమీదికి రావడానికి కారణం అజ్ఞానమే. పురుషుడుకోపించితే స్త్రీ ప్రళయం సంభవించిందనే తలంచాలి. కుసుమగాడు దయాపాత్రుడు. కుసుమవంటి భార్యారత్నాన్ని గౌరవించని ఆ మెంథ త్రయే దయాపాత్రుడు. అతను ఎవ్వతెతోనైనా కాలంగడుపుతూ వుండవచ్చునని నాకు సందేహం.

సరే, మూడోవుత్తరం తెరిచాను.

మూడవవుత్తరం

ప్రియతమా,

నాజీవితం నిరుద్దేశ్యమని తోస్తూవుంది. చూచేవాడు, చేయూతనిచ్చేవాడు లేనప్పుడు పుష్పంవికసించి లాభం? వాడి భూమిమీదపడి కాళ్లతో త్రొక్కబడడానికేనా? నేను మీగృహంలో నెలరోజులుండి రెండోపర్యాయంవచ్చా. మామగారే నన్నిక్కడకు పంపించారు. ఇన్నిదినాలలో వొకపర్యాయమైనా మీరు నాకు దర్శనం యివ్వలేదు. ప్రతిదినం మీరు గృహంలోనికి కనీసం యిరవైపర్యాయాలైనావచ్చి మావారితో నవ్వుతూ మాట్లాడుతూ వుండేవారు. కాని మీరు నావద్దకు రాకూడదని వొట్టువేసుకున్నారు. అనేకపర్యాయాలు పిలవనంపాను. అనేక పర్యాయాలు సిగ్గువదలి మీగదిలోకి వచ్చాను. కాని నావైపు కన్నెత్తికూడా చూడలేదు. ఇంత హృదయహీనులువుంటారని తలంచనైనా తలంచలేదు. నేను ప్రేమించడానికి, నమ్మడానికి, సేవచేయడానికి యోగ్యురాలను కాకపోవచ్చు. కానినయను యోగ్యురాలనుగానా? నేనాదినం ఎంతో ప్రయాసపడి మీకొరకు గులాబ్ జామూన్లు తయారుచేశాను? మీరు వాటిని చేత్తో ముట్టనైనాముట్టలేదు. మీరు నాయందు అంతనిర్దయలైనపుడు నేనుజీవించి ప్రయోజనమేమిటో నాకే తెలియడంలేదు. అపరాధం చెప్పకుండా శిక్షిస్తున్నారు. ఇది మీ అన్యాయంగాదూ? ఇదేమినీతి? నేను మాసంలో పదిరోజులే మీయింట్లో భోంచేశాను. ఆసంగతి మీకుకూడజ్ఞాపకమే. నేను నడవలేనంత బలహీనురాలనై పోయాను. నేత్రాల్లో జ్యోతిలేదు. సరే, మీయిష్టంవచ్చినట్లు కష్టపెట్టి యేడ్పించండి. ఒకదినం యీ అనీతికి అంతంవుంటుంది. ఇప్పుడు అన్ని ఆశలూ మృత్యువుమీదనే నిర్భరమై వున్నై. నామరణవార్తవినికూడ సంతోషంతో గంతు వేస్తారని, కన్నీటిబిందువు వొకటైనా రాల్చరని నేను అనుకుంటున్నా. ఇది మీదోషంగాదు. నాదౌర్భాగ్యం. క్రిందటిజన్మలో యేదో పాపంచేసివుంటా. మీ మీదస్తిరంగా నేను మిమ్మల్ని ప్రేమించకుండా వుండే శక్తి నాలోలేదు. వృక్షంమీదిరలత నిలబడివుంటుందా? వృక్షానికి యేమీ ఆధారం అవసరంలేదు. ఆశక్తిలతకు యెక్కడినుండి వస్తుంది? అది వృక్షాన్ని పెనవేసుకొనుటకొరకే పుట్టించబడినది. దాన్ని వృక్షం నుండి వేరుచేస్తే యెండిపోతుంది. వస్తులాకారమైన నాజీవితానికి కేంద్రం మీరు. నేను హారాన్ని. దాని దారం మీరు. ఆ హారపు ప్రత్యేకపుష్పం ఆదారాన్ని ఆధారంచేసుకొని వుంది. ఆ దారంలేనిది హారపు పుష్పాలు విడిపోయి ధూళిలో మిళితమౌతై.

నాకు 'శశో్న' అనే స్నేహితురాలు వుంది. ఈ సంవత్సరం ఆమెకు వివాహమైంది. ఆమె భర్త అత్తగారింటికి వచ్చినపుడు శశో్న పాదాలు భూమిమీద నిలవవు. ప్రతిదినం అనేక పర్యాయాలు శృంగారాన్ని మారుస్తూవుంటుంది. ముఖకమలం వికసించివుంటుంది. తనఉల్లాసాన్ని ఆపుకోలేదు. మాలోటి అభాగినుల మీద అవుల్లాసాన్ని వెదజల్లుతూవుంటుంది. నన్ను శశో్న వచ్చి కౌగలించుకున్నప్పుడు నేను హర్షోన్మాదాలవర్షంలోతడిచి ముద్దైపోతూవుంటాను. ఆదంపతు లిద్దరు అనురాగంలో మున్గివుంటారు. ఆ అఖండ ప్రేమక్షణానికి ప్రపంచంలోని యేవస్తువు సాటి? ప్రేమ యెల్లకాలం వొకేమాదిరి వుండదని నాకు తెలుసు. జీవనచింతలు, దురాశలు వారినికూడ తను వశంచేసుకుంటాయి. కాని యీమధురస్మృతులు దాచుకున్న ధనంలాగ అంతంవరకు వారికి సహాయంచేస్తూనే వుంటై. తనభర్త స్వగృహాని కేగినపుడు శశో్న వెక్కి వెక్కి యేడుస్తూవుంటుంది. ఆసమయాన నా హృదయం గద్గదమై పోతూవుంటుంది. భర్తదగ్గర నుండి వుత్తరంరాగానే ఆమెకు గొప్పనిధి దొరికినట్లు వుంటుంది. శశో్న యేడ్పులోనూ, విఫలతల్లోనూ వొక స్వాదంవుంది, వొక రుచివుంది. వ్యగ్రతతోనూ విహ్వలతతోనూ కూడివున్నై శశో్న నేత్రాశ్రువులు. నిరాశతోనూ, దుఃఖంతోనూ కూడివున్నై నా అశ్రువులు. ఆమె వ్యాకులతలో ప్రతీక్షావుల్లాసాలున్నై. నావ్యాకులతలో కేవలం నిరాశలున్నై. ఆమె రోదనలో అధికారమమతలున్నై. నారోదనలో భగ్నతాడనాలున్నై.

ఈ వుత్తరం పెద్దదౌతుంది. కాని నామనస్సులోని భారం తగ్గడంలేదు. భయంకరమైన రోజులు కాస్తున్నై. తండ్రిగారు నన్ను 'మసూరి' తీసుకువెళ్ళే ప్రయత్నంలో వున్నారు. నామూర్ఖతవల్ల ఆయనగారికి క్షయ అని సందేహంగావుంది. నాకు మసూరే కాదు స్వర్గంకూడ నరకంతో సమానమని తెలియదు తండ్రిగారికి.

అభాగిని,

కుసుమ.

## నాల్గవవుత్తరం

నాప్రాణదేవతా,

నిన్న మసూరినుండి తిరిగివచ్చాను. ఆరోగ్యాన్ని చేకూర్చే మంచిస్థలమని అందరూ అంటారు. కావచ్చు. నేనొకదినంకూడ నాగది వదలిపోలేదు. భగ్నహృదయులకు ప్రపంచమంతా శూన్యం. నేను రాత్రి వొక మంచిస్వప్నంచూశాను. చెప్పి ప్రయోజనం? మృత్యువంటే యిప్పటికికూడా భయంవేస్తూవుంది. ఆశా బంధనాలు నాజీవితాన్ని బంధించివేస్తై. జీవితోద్యానద్వారంవద్దకుపోయి దానిలో షికారు చేయకుండా తిరిగిపోవడం ఎంతదుఃఖదాయకం? ఆవుద్యానవనంలో యెంతో సౌరభంవుంది. యెంతో ఆనందంవుంది. నాకాద్వారమే మూయబడివుంటుంది. ఆవుద్యానవనంలో విహరించి ఆనందం పొందవలెనని అనేక కోరికలతోనూ, అనేకప్రయత్నాలతోనూ బయలుదేరా. కాని నేను ఆవుద్యానవనసమీపానికి చేరగానే ద్వారం మూయబడినది.

నేను మరణించినతర్వాత నాశవంమీద రెండు కన్నీళ్ళబిందువులైనా వదుల్తారా? ఈమాత్రం వుదారత చూపించలేరూ? మరణించేవారి అపరాధాల్ని అందరూ క్షమిస్తారు. మీరుకూడా నన్ను క్షమించండి. వచ్చి నాశవాన్ని స్నానంచేయించి నాముఖాన కుంకుమబొట్టు పెట్టండి. నాచేతులకు గాజులతొడిగి గంగాజలం నోట్లోపోయండి. నాలుగైదుఅడుగులు నాశవాన్ని మోయండి. దానితో నాఆత్మ సంతుష్టిచెంది మిమ్మ్మ ఆశీర్వదిస్తుంది. భగవంతునిదర్బారులో మీయశాన్ని గానంచేస్తానని వాగ్దానం చేస్తున్నా. ఇదికూడా

